

# చేనేత కబురు

జూన్ 2003 సంచిక 3 (For private circulation Only)

మిత్రులారా,

నమస్కారం. చేనేత విజ్ఞాన విధాన కేంద్రం*(CHIP)* వెలువరిస్తున్న చేనేత కబురు మూడవ సంచికను మీ చేతిలో వుంచుతున్నాం. గతంలో ప్రాధాన్యమిచ్చిన రంగాలను పూర్తిగా పక్కన పెట్టె వాదమే ఇప్పటి విధాన నిర్ణేతలు అనుసరిస్తున్న విధానం. ఆర్థిక సరళీకరణ, ప్రపంచీకరణల ప్రభావమిది. ఇలా ఎందుకు చేస్తున్నారని అడిగితే ఇంత కాలం ఆయా రంగాలకు ఇచ్చిన సబ్సిడీలు భారత ఆర్థిక వ్యవస్థ పురోగతికి ఏ విధంగాను దోహదం చేయలేదన్నది వారిచ్చే సమాధానం.

వారు ఒక విషయం తెలివిగా మరచిపోతున్నారు. విధానపరమైన ప్రయోజనాలు వాస్తవంగా లబ్ధిదారులకు ఏనాడూ చేరలేదు. కారణం అవినీతి. క్రింది స్థాయిలోని వాస్తవిక పరిస్థితులు పరిగణనలోనికి తీసుకోకుండ పైనెక్కడో ప్రణాళికలు రచించి వాటిని అమలుచేయాలని చూడడం, కార్యక్రమాల రూపకల్పన లోనే లోపాలు ఉండటం, ఆపైన వాటి అమలులో చిత్తశుద్ధి లోపించడం, ప్రభుత్వ కార్యక్రమాల్లో నిజంగా లబ్ధిదారులకు చేరుతున్నది పదిహేను శాతమేనని 1985లో అప్పటి ప్రధాని రాజీవ్ గాంధీ చేసిన ప్రకటన ఎంత సంచలనం పుట్టించిందో అందరికీ తెలుసు. ఈ కఠోర వాస్తవాన్ని గుర్తించిన ప్రభుత్వాలు పై పరిస్థితిలో మార్పు తీసుకురావడానికి వివిధ చర్యలు ప్రకటిస్తూవచ్చారు. సంక్షేమ అభివృద్ధి కార్యక్రమాల అమలులో స్వచ్ఛంద సంస్థలను భాగస్వాములు చేయడమనేది అందులో ఒకటి. ప్రభుత్వ సేవలు సక్రమంగా అందించడానికి పాలనా పద్ధతుల్లో మార్పులు తెస్తున్నారు. ఒక పక్క ఇవన్ని జరుగుతుండగా మరోవైపు మార్కెట్ పోటీ తారకమంత్రంగా మారింది. సబ్సిడీ బూతు పదమై కూర్చుంది. పోటీని తట్టుకోని నిలవలేని రంగాలకు సబ్సిడీలు ఇచ్చే పద్ధతి అనేక అభివృద్ధి చెందిన దేశాల్లో ఇప్పటికి కొనసాగుతున్నదనే వాస్తవాన్ని మార్కెట్ పోటీ గురించి జపం చేస్తున్నవారు గమనించినట్టు కనిపించదు. మన దేశంలోని మార్కెట్ ప్రేమికుల గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ప్రతి చోటా మార్కెట్ పోటీకి దారివ్వడమే మన పాలకుల విధానమైంది. అట్లాగని సబ్సిడీలు రాయితీలు పూర్తిగా ఎత్తేసారా అంటే అదీ లేదు. తెగబలిసిన రంగాలకు, మనుషులకు పోత్సహకాలు, పన్నురాయితీలు, సబ్సిడీలు ఒకవైపు ఇస్తూనే ఉన్నారు. పైరవీ, లాబీలు చేసే శక్తి ఉండాలి కాని కోరినవన్ని లభ్యమవుతాయి. పాలకుల విధానాలనే శాసిస్తున్న క్షుద్ర విద్య ఇది. అటువంటి శక్తి యుక్తులు లేని సాధారణ రంగాలకు చట్ట సభలలోని రాజకీయ ప్రాతినిధ్యం వల్ల విధాన పరమైన ప్రయాజనాలు ఒనగూడే రోజులు ఎటు పోయాయి. బిజినెస్ సంబంధాలను, డబ్బు తదితర ప్రలోభాలను రాజకీయ పార్టీలకు ఎరగా వేసి తాముకోరుకున్న నిర్ణయాలను ప్రభుత్వం చేసేలా వివిధ లాబీలు ఒత్తిడి తీసుకురావడం అనేది ఇప్పటి వాస్తవం.

చేనేత రంగం విషయం చూసినపుడు ఇంతకలం కాగితాలలో అమలు జరిపిన విధానాలను ఒకవైపు వెనక్కు తీసుకుంటూ ఎగుమతులను ప్రోత్సహించే పేరుతో పవర్‌లూమ్స్ మరియు మిల్లులను కొత్తగా సబ్సిడీలు ఇవ్వడం ప్రారంభించారు. ఎంతో విస్తృతి, వైవిధ్యం గల భారత జౌళి రంగాన్ని గుర్తుపట్టని విధంగా మార్చేందుకు జరుగుతున్న ప్రయత్నమిది. ఆధునీకరణ పేరుతో పేదల ప్రయోజనాలకు హాని కలిగించే మూస వ్యవస్థను ఈ రంగంలో సృష్టించ చూస్తున్నారు. జౌళి రంగానికి సంబంధించిన విధానాలు అవినీతి, బంధప్రీతి, దాపరికం, అపార్థాల బురద గుంటలో పడి దోర్లుతున్నాయి. ఈ నేపధ్యంలో ఆంధ్ర ప్రదేశ్‌లో చేనేత రంగానికి నిధులు తగ్గిపోవడం, విధానాల్లోని తప్పుడు ప్రాధమ్యాలు, పథకాల డొల్లతనాన్ని ప్రస్తుత సంచికలో చర్చించచూస్తున్నాం. ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ పర్యవసానాలను గురించి హ్యూమన్ స్కేప్ అనే పత్రిక ప్రచురించిన ఒక వ్యాసాన్ని కూడా ఈ సంచికలో పొందుపర్చుతున్నాం.

డి. నర్సింహారెడ్డి

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

## చేనేత రంగం చేసిన తప్పేమిటి ?

గ్రామీణ ఉపాధి రంగాల్లో చేనేతకు ఉన్న ప్రాధన్యం జగానికంతా తెలుసు. భారత దేశంలో వందలాది సంవత్సరాల నుండి సాంప్రదాయ సిద్ధంగా సాగుతున్న వృత్తి ఇది. భారత ఆర్థిక వ్యవస్థకు ఉపాధ కల్పనా శక్తిని ఇనుమడించే చర్యలను పార్టీలతో నిమిత్తం లేకుండా ప్రతి ప్రభుత్వం ప్రకటిస్తూనే ఉంది. అలాంటపుడు ఉపాధి కల్పనలో వ్యవసాయం తర్వాత స్థానాన్ని ఆక్రమించిన చేనేత రంగాన్ని అన్ని విధాలా ప్రోత్సహించాలని ప్రతి ఒక్కరు ఆశిస్తారు. దేశంలో రెండున్నర కోట్ల మంది ప్రజలకు ఉపాధి నిస్తున్న ఈ రంగం మొత్తం ఉత్పత్తుల్లో 22% వాటా కలిగి ఉంది. ప్రణాళికా సంఘం టాస్క్ పోర్స్ స్వయంగా

| ఆంధ్ర ప్రదేశ్ బడ్జెట్‌లో చేనేత రంగానికి కేటాయించిన నిధులు (కోట్లలో) | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | *2001-02* | | *2002-03* | | *2003-04* | |
| | ప్రణాళిక | ప్రణాళికేతర | ప్రణాళిక | ప్రణాళికేతర | ప్రణాళిక | ప్రణాళికేతర |
| పరిశ్రమలు, వాణిజం | 217.83 | 44.09 | 196.30 | 41.30 | 283.96 | 39.78 |
| చేనేత, జౌళీ రంగాలు | 46.71 | 4.25 | 42.59 | 4.59 | 35.68 | 03 |

ఈ విషయం గుర్తించింది. అయినప్పటికి చేనేతమనుగడకు పోరాడి సాధించుకున్న విధానాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒకటొకటిగా ధ్వంసం చేయడంతో పాటు నిధుల కేటాయింపులు కుదించుకుంటున్నాయి. చేనేత కార్మికులు ఏ పాపం చేశారని ప్రభుత్వాలు ఇంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి ?

సత్యం నివేదిక వచ్చిన తర్వాత చేనేత రంగానికి కేటాయింపులు బాగా తగ్గించారన్నది ఈ పట్టిక ద్వారా బోధపడుతున్నది. చేనేతను వదిలేసి ఆధునిక మిల్లులను ప్రోత్సహించాలని సత్యం కమిటీ సిఫార్సు చేసిన విషయం తెలిసిందే. కమిటీ నివేదికను ఆమోదించబోమని రాష్ట్ర , కేంద్ర ప్రభుత్వాలు బహిరంగ ప్రకటనలు చేసినా ఆచరణలో జరిగిందేమిటో కళ్లముందు కనబడుతూనే ఉంది. స్వర్ణాంధ్ర సాధనకు 'విజన్ 2020' పత్రంలో ప్రకటించిన 'వృద్ధిచాలక(గ్రోత్ ఇంజన్)' ల జాబితాలో చేనేత రంగానికి స్థానం లభించకపోవడమన్నది పాలకుల ఉద్ధేశాన్ని స్పష్టం చేస్తుంది. పరిశ్రమలు, వాణిజ్య రంగానికి జరిపిన కేటాయింపులల్లో చేనేత రంగం వాటా 2001-02 ప్రణాళిక 21% ఉంది. 2002-03 లో తిరిగి 21% ఉంది అయితే 2003-04 ఆర్థిక సంవత్సరానికి వచ్చేసరికి ఈ వాటా 12% పడిపోయింది.

చేనేత రంగానికి 2001-02, 2002-03 సంవత్సరాల మధ్య మొత్తంగా నాలుగు కోట్ల రూపాయల కోత పడింది. 2002-03, 2003-04 మధ్య కాలంలో సుమారు 7 కోట్ల రూపాయల సహాయం తగ్గిపోయింది.

పరిశ్రమలు, వాణిజ్య విభాగానికి జరిగిన ప్రణాళికేతర కేటాయింపులలో అంతకు ముందు 9 శాతం ఉన్న చేనేత రంగం వాటా 2002-03 సంవత్సరంలో 21% కు చేరుకుంది. 2003-04 సంవత్సరంలో చేనేత వాటా తిరిగి దిగజారి 10% చేరుకున్నది. ప్రణాళికేతర నిధులలో 95% ఉద్యోగుల జీతభత్యాలకే వెచ్చిస్తారనే వాస్తవాన్ని పరిగణనలోకి తీసుకున్నట్లయితే మధ్యలో కేటాయింపులు ఎందుకు పెరిగిందో అర్థమవుతుంది.

ప్రణాళిక కేటాయింపులోని గణనీయమైన మొత్తం కేంద్ర ప్రాయోజిత పథకాల ద్వారా వస్తోంది. కేంద్ర పథకాలలో రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చేలో మ్యాచింగ్ గ్రాంటు విలువ 2003-04 సంవత్సరంలో 4.27కోట్ల రూపాయలు. 2002-03 సంవత్సరం సవరించిన అంచనాలు 17.67కోట్ల రూపాయాలు కాగా అ తర్వాత సంవత్సరంలో ఈ మొత్తం 75% మేరకు కుదించుకుపోయిందని ఈ అంకెలు సూచిస్తున్నాయి.

కేంద్ర ప్రాయోజిత పథకాల్లో అత్యధిక నిధులు 'దీన్ దయాల్ హతకర్గా ప్రోత్సహన్ యోజన' కు ఇస్తున్నారు. దాని తర్వాత ప్రోజెక్టు ప్యాకేజిని పథకం అమలుకు ప్రాధాన్యతనిస్తున్నారు. ఈ పథకంలో రాష్ట్ర వాటా అతి వేగంగా పడిపోవడం గమనించవచ్చు. 2001-02లో 28% ఉన్న రాష్ట్ర వాటా 2002-03లో 18%కు తగ్గిపోయింది. 2003-04 సంవత్సరానికి 2% పెరిగినట్లు కనిపించినా సవరించిన అంచనాలు బయటపడితే కాని వాస్తవ పరిస్థితి వెల్లడి కాదు. ఒకవేళ పెరిగిందనుకున్నా అందులో 8% మేర రాష్ట్ర వాటా తగ్గిపోయందనే వాస్తవాన్ని అది కప్పిపెట్టజాలదు.

2001-02 సంవత్సరంలో 997.14 లక్షల రూపాయల రాష్ట్ర నిధులు

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

వెచ్చించగా 2002–03లో 533.13 లక్షలు, 2003–04లో 426.50 లక్షల రూపాయలు ఖర్చు చేశారు. అంటే రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే నిధుల్లో 57% మేర తగ్గుదల ఏర్పడింది. కేంద్ర నిధులు విషయాలలోను ఇదే పరిస్థితి నెలకొన్నది. 2001–02 సంవత్సరంలో 3447.82 లక్షల రూపాయల నిధులు కాగా 2002–03 లో 2952.30 లక్షలు, అ తర్వాత సంవత్సరంలో 2129.04 లక్షల రూపాయలు వచ్చాయి. అంటే కేంద్రం నుంచి వచ్చే నిధుల్లో 38% తగ్గుదల కనబడుతుంది.

కేంద్ర పథకాలు, వాటికి రాష్ట్ర ప్రభుత్వం మ్యాచింగ్ గ్రాంటు ఏ స్థాయికి పడిపోయందంటే రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే డబ్బు కేవలం ఉద్యోగుల జీతభత్యాలు చెల్లించడానికే సరిపోతోంది. అసలు కొన్ని పథకాలు వచ్చే ఏడాది బతికి ఉంటాయా అని సందేహం కూడా కలుగుతుంది. ఇకపోతే అతి పెద్ద పథకమైన దీన్ దయాళ్ యోజనకు కేంద్ర ప్రభుత్వం ఉద్దేశించిన లక్ష్యాలు ఆంధ్ర ప్రదేశ్‌లోని చేనేత కార్మికుల వాస్తవ అవసరాలకు, ఆమాటకొస్తే మొత్తం దేశంలోని చేనేత రంగ అవసరాలకు బహు దూరంగా ఉన్నాయి. ఈ పథకాల

**పట్టిక-2 ఆంధ్రప్రదేశ్‌లో కేంద్ర ప్రాయోజిత పథకాల కేటాయింపులు 2001-04 (లక్షలలో)**

| పథకాలు | కేంద్ర నిధులు | | | రాష్ట్ర నిధులు | | |
|---|---|---|---|---|---|---|
| | *2003-04* | *2002-03* | *2001-02* | *2003-04* | *2002-03* | *2001-02* |
| హ్యాండ్‌లూమ్ రిజర్వేషన్ ఎన్‌ఫోర్స్‌మెంట్‌కు అయ్యే ఖర్చు(హెడ్‌క్వర్టర్స్, జిల్లా ఆఫీసులు కలుపుకొని) | 40 | 26 | 26 | 10 | - | - |
| చేనేత వస్త్రం పై రాయితీ | 6 | 350 | 322.09 | 1 | 25 | - |
| చేనేత సంఘాలు పోదుపు చేసిన డబ్బుకు ఇచ్చే మ్యాచింగ్ గ్రాంటు | 25 | 50 | 235.42 | 25 | 25 | 110 |
| వర్క్‌షెడ్ కమ్ ఇల్లు పథకం కోసం సబ్సిడి | 75 | 200 | 770.21 | 51.81 | 50 | 110 |
| ప్రాజక్ట్ ప్యాకేజి పథకం | 21.49 | 284.14 | 765.98 | 21.49 | 67.88 | 513.13 |
| దిన్ దయల్ ప్రోత్సహన్ యోజన* | **1291.2** | **1669.29** | **432.64** | **317.20** | **365.25** | **264.81** |
| చేనేత కార్మికుల శిక్షణ | 10.26 | 4.5 | 4.5 | - | - | - |
| దుస్తుల ఎగుమతి పార్కు | 500 | - | - | - | - | - |
| ఆరోగ్య పథకం | 50 | 103.22 | 226.73 | - | - | - |
| సమగ్ర చేనేత గ్రామాభివృద్ధి | 100 | 205.25 | 464.25 | - | - | - |
| చేనేత అభివృద్ధి కేంద్రాలు | - | 10 | - | - | - | - |
| పవంలూమ్స్ వర్కర్‌లకు వర్క్‌షెడ్‌ల పథకం | 10 | 50 | 200 | - | - | - |
| **Total** | **2129.04** | **2952.30** | **3447.82** | **426.50** | **533.13** | **997.94** |

గమనిక : ఆంధ్ర ప్రదేశ్ బడ్జెట్ అంచనాల నుంచి స్వీకరించిన వివరాలు

* **2001-02** సవరించిన అంచనాలు

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

వల్ల తమకు ఒడగుడే ప్రయోజనమేమిటన్నది చేనేత కార్మికుల ముందున్న ప్రశ్న.

2002-03లో చేనేత వస్త్రాలకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కలసి 350 లక్షల రూపాయలు రిబేటును ఇచ్చాయి. 2003-04 సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వం కేవలం 6 లక్షల రూపాయలు రిబేటు కింద ఇవ్వగా రాష్ట్ర ప్రభుత్వం కేవలం లక్ష రూపాయలు కేటాయించింది. అంటే చేనేత వస్త్రం పై అ సంవత్సరం ఇచ్చిన మొత్తం రిబేటు విలువ 7లక్షల రూపాయలే. ప్రభుత్వ లెక్కల ప్రకారం రాష్ట్రంలో 1,74,690 మంది చేనేత కార్మికులు ఉన్నారనుకుంటే రిబేటు వల్ల అందులోని ప్రతి ఒక్కరికి ఏడాది మొత్తంపైన కలిగిన లాభం నాలుగేసి రూపాయలు మాత్రమే. పరిశ్రమల విభాగం కమిషనరేట్ కార్యలయ ఆధునీకరణకు కేటాయించిన నిధుల ( రూ. 3.45 కోట్లు) పాటి చేయదు ఈ చేనేత బడ్జెట్. హైదరాబాద్ సమీపంలో ఏర్పాటు చేస్తున్న బయోటెక్నాలజీ పార్కుకు 2002-03 సంవత్సరంలో 3 కోట్ల రూపాయలు, 2003-04 సంవత్సరంలో 6 కోట్ల రూపాయలు ప్రభుత్వం కేటాయించింది. ఈ పార్కు వల్ల అతికష్టంపైన 10,000 ఉద్యోగాలు మాత్రమే వస్తాయి. పరిశ్రమలను ప్రోత్సహించే పనులలో 2002-03లో 21కోట్ల రూపాయలు, 2003-04లో 12.50కోట్ల రూపాయలు రాయితీలు రాష్ట్రప్రభుత్వం కేటాయించింది. రాష్ట్రంలోని మరమగ్గాలకు 3 కోట్ల రూపాయలు సబ్సిడీని విద్యుత్ పై ప్రభుత్వం సమకూర్చుతుంది. వీటినన్నిటిని బట్టి చూసినపుడు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాధాన్యతలు చేనేత రంగం నుండి మరొవైపుకు మళ్లాయని అర్థమవుతుంది. రాష్ట్రంలోని 1,74,690 చేనేత కుటుంబాలకు స్వయం ఉపాధి కల్పిస్తున్న చేనేత రంగానికి అరకొరగా డబ్బివ్వడమంటే అర్థమిదే.

చేనేత రంగానికి అత్యంత ప్రాధాన్యమిస్తున్నామని రాష్ట్ర ప్రభుత్వం చెబుతున్న వాటికి వాస్తవాలకు ఏ మాత్రం పొంతన లేదు. రాష్ట్రప్రభుత్వ పథకాలను మరమగ్గాలకు, చేనేత మగ్గాలకు కలపి వర్తింపజేస్తున్నారు. ఈ రెండింటి మధ్య ఉన్న తేడాను ఉద్ధేశ పుర్వకంగానే చూడనిరాకరిస్తున్నారు. చేనేత కార్మికుల కోసం అమలు పరుస్తున్న సంక్షేమ పథకాలు కూడా చాలా తక్కువ. అమలు చేస్తున్న పథకాల వల్ల ఆశించిన ఫలితాలు ఎక్కడా కనిపించని పరిస్థితి. ఉదాహరణకు 2003-04 సంవత్సరంలో 41,552 మంది చేనేత కార్మికులకు కార్పొరేట్ హస్పటల్స్‌లో చికిత్స అందించే సదుపాయాన్ని కల్పించారు. ఈ పథకం కింద విడుదలయ్యే డబ్బు కార్పొరేట్ హస్పటల్స్‌కు ఇస్తున్నారు. పేద రోగులకు ఉచితంగా సేవలందించాల్సిన ఈ ఫైవ్‌స్టార్ హస్పటల్స్ ఆచరణలో ఏం చేస్తున్నయో అందరికి తెలుసు. పై పథకం వల్ల లాభ పదేది కార్పొరేట్ హస్పటల్స్ అనేది స్పష్టం.

కేంద్ర రాష్ట్ర నిధుల్లో తగ్గుదల




ఆయా పథకాలను ఎలా ఉపయోగించుకోవాలో, అందుకు సంబంధించిన నియమ నిబంధనలేమిటో చేనేత కార్మికులకు తెలియదు. ఈ పథకాల అమలుకు సంబంధించిన సమాచారాన్ని కాని, వాటి అమలు ఫలితాలపై తాము చేసిన నివేదికలను కాని ఎవరికి అందుబాటులో ఉంచరు. 40కోట్ల రూపాయాల ఖర్చుతో చేపట్టిన ఆప్కో పునర్ వ్యవస్థీకరణ ప్రాజెక్టుకు సంబంధించిన వివరాలేవి బయట ప్రపంచానికి తెలియనివ్వరు. అప్పరెల్ పార్కులకు చేనేత కార్మికుల వాస్తవ అవసరాలు, ఆకాంక్షలకు సంబంధమే అసలు ఉండదు. చేనేత కార్మికులను తప్పుదోవ పట్టించేందుకు చేనేత విభాగం ద్వారా ఈ పార్కులు ఏర్పాటు చేయిస్తున్నారు.

స్థూలంగా చూస్తే చేనేత కార్మికుల కోసం రూపొందించిన సబ్సిడీ పథకాలను పూర్తిగా ఉపసంహరించారు. సంక్షేమ పథకాలు నామ మాత్రంగా పనిచేస్తున్నాయి. వాటికి ఇచ్చే నిధులు రోజురోజుకి తగ్గిపోతున్నాయి. ఆయా పథకాల కింద లబ్ధిపొందుతున్నది నిజానికి వ్యాపారులు, పవర్‌లూమ్ యజమానులు, చేనేత విభాగం ఉద్యోగులు, సంఘాలే తప్ప చేనేత కార్మికులు కాదన్నది నిష్ఠుర సత్యం. అసలు ఈ పథకాలు చేనేత కార్మికుని వాస్తవ అవసరాలను దృష్టిలో ఉంచుకొని రూపోందించినవి కానేకాదు. మరమగ్గాలు, టెక్స్‌టైల్ మిల్లులు చేసే అక్రమ వ్యవహారాల నుండి చేనేత రంగాన్ని కాపాడడంలో హ్యాండ్‌లూం రిజర్వేషన్ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం పూర్తిగా విఫలమైంది. ముడి సరుకులు సరఫరా చేసేందుకు సమర్థవంతమైన వ్యవస్థ ఏర్పాటు చేయాలని, ముడి సరుకుల ధరలు, హేతుబద్ధం చేయాలని, తమ ఉత్పత్తులకు మార్కెటింగ్ పరంగా మరింత తోడ్పాటు ఇవ్వాలని చేనేత కార్మికులు ఎప్పటినుంచో కోరుతున్న వారి డిమాండ్‌ను ప్రభుత్వాలు పెడచెవిన పెట్టాయి. సత్యం కమిటీ సిఫార్సులను ప్రభుత్వాలు సంపూర్ణంగా ఆమోదించయిఅనడానికి ఇంతకు మించి వేరే రుజువులు అవసరం లేదు.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

## అప్పెరెల్/ టెక్స్‌టైల్ ఎగుమతి పార్కుల్లో చేనేత వస్త్రాలకు చోటు ఉందా ?

రేడిమేడ్ వస్త్రాల ఎగుమతి రంగంలో రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా పెట్టుబడులు ప్రోత్సహించే ఉద్దేశంతో అప్పెరెల్ పార్కుల పథకాన్ని కేంద్ర ప్రభుత్వం రూపొందించింది. అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన వస్త్ర తయారి యూనిట్స్‌ను నెలకొల్పి ఎగుమతుల భారీగా పెంచాలన్నది ఈ పథకం లక్ష్యం. 2010 సంవత్సరం నాటికి 1,25,000 కోట్ల రూపాయల ఎగుమతుల లక్ష్యాన్ని సాధించాలని జాతీయ జౌళి విభాగ పత్రంలో నిర్దేశించారు.

ఈ పథకం కింద పార్కులు ఏర్పాటు చేయడం కోసం ప్రభుత్వాలు ఉచితంగా స్థలాన్ని సమకుర్చుతాయి. పార్కు విస్తీర్ణం 150 నుండి 250 ఏకరాల మధ్యలో ఎంతైన ఉండవచ్చు. పోర్టులు, విమానాశ్రయాలు, రోడ్లు తదితర రవాణా సదుపాయాలున్నచోట ముడిసరుకులు ఇతర మౌలిక సదుపాయాలు అందుబాటులో ఉన్నచోట ఈ పార్కులు ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. వీటికి అవసరమైన విద్యుత్, రోడ్లు, టెలికమ్యునికేషన్ సదుపాయాలన్ని ప్రభుత్వం సమకూర్చుతుంది. ఈ పార్కుల్లోని యూనిట్లు సమర్థవంతంగా పనిచేయడానికి వీలుగా ప్రభుత్వం సమకూర్చే సదుపాయాలకు ఉన్నత నాణ్యత ప్రమాణాలు పాటిస్తారు.

ఒక్కొక్కటి కనీసం రెండేసి వందల కుట్టుమిషన్లను కలిగి ఉండే రేడిమేడ్ వస్త్రాల తయారీ యూనిట్స్‌ను ఈ పార్కుల్లో నెలకొల్పుతారు. ఈ పార్కు పూర్తిస్థాయిలో పనిచేయడం ప్రారంభించిన తర్వత కనీసం 20,000 మందికి ఉపాధి లభిస్తుంది. బటన్ల తయారీ వంటి అనుబంధ మాన్యుఫాక్చురింగ్ యూనిట్స్ కూడా ఏర్పాటు చేసుకోవచ్చు. ఇక్కడ తయారు చేసే దుస్తుల విలువను మరికొంత పెంచేందుకు దోహదపడే ప్రాసెసింగ్, వాషింగ్ యూనిట్స్‌ను సైతం పార్కుల్లో నెలకొల్పుతారు. ఈ పార్కుల పరిధిలో కార్మిక చట్టాలను సడలిస్తారు. మౌలిక సదుపాయాలపై రాష్ట్రప్రభుత్వం వెచ్చించిన మొత్తంలో 75% కేంద్రం చెల్లిస్తుంది. ఆంధ్ర ప్రదేశ్ 5 కోట్ల రూపాయల బడ్జెట్ కేటాయించింది. ఈ గ్రాంటు గరిష్టంగా 10 కోట్ల రూపాయలకు మించకుండ ఉంటుందని నిబంధనలు చేబుతున్నాయి. పెట్టుబడులు వచ్చే అవకాశాలు, ఉపాధి అవకాశాలు, టెక్నాలజీ ఆధునీకరణ, ఎగుమతులతో పాటు ఇతర అవకాశాలు, శ్రమను సద్వినియోగపరుచుకునే వాతావరణము వంటి అంశాలు మార్గదర్శకాల్లో పొందుపర్చారు.

హైదరాబాదు సమీపంలోని గుండ్ల పోచంపల్లి వద్ద 173.86 ఎకరాల స్థలంలో ఒక అప్పెరల్ ఎగుమతి పార్కును ఏర్పాటు చేస్తు జాతీయ ఫ్యాషన్ టెక్నాలజీ సంస్థ, అప్పెరల్ ట్రైనింగ్ డిజైనింగ్ సెంటర్, హైదరాబాద్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫ్యాషన్ టెక్నాలజి వంటి సంస్థలు ఈ పార్కుకు సహాయపడతాయని భావిస్తున్నారు. బట్టల తయారీలో నైపుణ్యం పెంచేందుకు ఈ సంస్థలు తోడ్పడతాయని ప్రభుత్వం భావిస్తోంది. దుస్తుల తయారీ యూనిట్లకు రాష్ట్ర ప్రభుత్వం ఈ కింది ప్రోత్సాహకాలను అందిస్తోంది.

- స్థిర పెట్టుబడిలో వ్యయంలో 20% సబ్సిడి (రూ. 20లక్షలు గరిష్ట పరిమితి)

- స్థిర పెట్టుబడిలో 135% లోబడి 14 సంవత్సరాల పాటు అమ్మకపు పన్ను వాయిదా, 7సంవత్సరాల పాటు అమ్మకపు పన్ను మినహాయింపు.

- కలుషిత వ్యర్థ జలాల తరలింపునకు ఉమ్మడి సదుపాయం.

ఎగుమతి లక్ష్యంతో వస్త్రోత్పత్తి కార్యకలాపాలను ప్రోత్సహించేందుకు పార్కులు ఏర్పాటు చేస్తున్నారన్నది స్పష్టం. రేడిమేడ్ దుస్తుల తయారీ పరిశ్రమకోసమే వీటిని ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తుండగా చేనేత పరిశ్రమకు చేయుత నివ్వడం కోసమే పార్కులు ఏర్పాటు చేస్తున్నామని ప్రభుత్వాలు, అధికారులు, రాజకీయ నాయకులు నమ్మబలకడం విచిత్రం. చేనేత రంగం గురించి వీరికి తెలియకపోయుండాలి లేదా అలాంటి పథకాలను ఆశ్రయించి తన రూపు రేఖలను చేనేత రంగం మార్చుకోవాలన్నది వీరి అభిమతమైన కావాలి. నిజానికి చేనేత కార్మికులు 'పార్కు' తరహా వాతావరణంలోనే తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు. ఈ రంగాన్ని ఉద్ధరించ దలుచుకున్నట్లయితే చేనేత కేంద్రాలుగా వర్ధిల్లుతున్న ప్రదేశాల్లో మౌలిక సదుపాయాలు అభివృద్ధిపర్చి చేనేత ఎగుమతులను ప్రోత్సహించవచ్చు.

చేనేత కార్మికులు రేడిమేడ్ దుస్తుల తయారీ కార్మికులుగా అవతరించి పార్కులో ఉపాధి పొందాలన్న ఉద్దేశ్యమేదో ఉన్నట్లు కనబడుతోంది. అదే నిజమైతే సత్యం కమిటీ యొక్క మరొక సిఫార్సును ప్రభుత్వం అమలులోకి తెస్తుందని భావించాలి.

---

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

**చేనేతకు చివరి రోజులా ?**

**(కాత్యాయనీ చామరాజ్ రచన, ' హ్యూమన్ స్కేప్' సౌజన్యంతో)**

**నిష్పాక్షిక, స్వేచ్ఛ వాణిజ్యం ('fair and free trade')అనే భావన నేతి బీరకాయలాంటిది. అందులో నిష్పాక్షికత లేదు, స్వేచ్ఛ అంతకన్న లేదు. ప్రస్తుత టెక్నలజీ యుగంలో దుర్నీతితో కూడిన ప్రపంచీకరణ ప్రక్రియలో చేనేత రంగం, చేనేత కార్మికులు తీవ్ర అనిశ్చితిని ఎదుర్కోవాల్సి వస్తోంది.**

బ్రతుకు తెరువులు ఒకవైపు సంక్షోభంలో చిక్కుకోగా పాలకుల పైత్యం మరొవైపు ప్రకోపించింది. ఈ సంక్షోభంపై పాలకుల ప్రేలాపనలు గమనించండి. అప్పులు కట్టలేక ముందుకెళ్లే దారి లేక రైతులు, చేనేత కార్మికులు ఆత్మహత్యలు పాల్పడుతుంటే నష్టపరిహారం పేరిట వచ్చే డబ్బు కోసం ఆశపడి వారు ప్రాణాలు తీసుకుంటున్నారని ఒక ప్రభుత్వం ప్రకటించింది. ఆత్మహత్యలకు పాల్పడకుండా వారిలో మనోస్థయిర్యం పెంచడానికి మానసిక వ్యాధుల నిపుణుల చేత 'కౌన్సిలింగ్' చేయిస్తామని మరో ప్రభుత్వం పేర్కొన్నది.

రైతులు, చేనేత కార్మికుల బ్రతుకులను తమ విధానాలు ఎలా ఛిద్రం చేసి ఆత్మహత్యలకు పురికొల్పుతున్నాయో ఆత్మ పరిశీలన చేసుకోవాలన్న ఆలోచన మాత్రం పాలకులకు తట్టడం లేదు.

21వ శతాబ్దానికి ఉండదగిన విలువలన్నీ పుణికి పుచ్చుకున్న రంగం చేనేత పరిశ్రమ. పర్యావరణానికి ఎలాంటి కష్టం కలిగించని పరిశ్రమ ఇది. ఉపాధి కల్పనలో దానికదే సాటి. అయితే పశ్చిమ దేశాల అభివృద్ధి నమునాలను గుడ్డిగా అనుసరిస్తున్న మన నిపుణుల కంటికి అదొక అసమర్థ, మొరటు, చావుకు సిద్ధంగా ఉన్న పరిశ్రమగా కనబడుతున్నది. ఆ జీవనాన్ని సృష్టించే విధ్వంసక అభివృద్ధి, నిరుద్యోగం ఇరవై ఒకటవ శతాబ్దాన్ని పట్టి పీడిస్తున్నాయి. ప్రస్తుత పోటీ ప్రపంచంలో మర మగ్గాలకు, మిల్లులకే జీవించే హక్కుందనే నీతిలో పాలకులు వ్యవహరిస్తుండటంలో వింతేమి లేదు.

భారతీయ చేనేత రంగాన్ని ధ్వంసం చేసిన బ్రిటిషు మిల్లు వస్త్రాలనుబహిష్కరించాలనే నినాదంపై ఆధారపడి స్వాతంత్రోద్యమం సాగింది కనుక స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ రంగాన్ని కాపాడటం కోసం అనేక చట్టాలు చేశారు. ఇంకా చాలా చాలా మాట్లాడారు. చేనేత రంగంపై సానుభూతి ఒలకబోస్తూనే మరమగ్గాలను, కంపోజిట్ మిల్లులను భారీ స్థాయిలో ఏర్పాటు చేయడం ప్రారంభించారు. ప్రతి మరమగ్గం 14 మంది చేనేత కార్మికుల ఉపాధిని లాగేసుకుంటుందనే వాస్తవం తెలిసికూడా ఇలా చేశారు.

1985 లో ప్రకటించిన టెక్స్టైల్ విధానం స్వాతంత్ర్యానంతర కాలంలో వచ్చిన తొలి చేనేత వ్యతిరేక విధానమని చెప్పవచ్చు. అయినప్పటికి సామాజిక బాధ్యతల గురించి అది మాట్లాడటం మానలేదు. ఉపాధి అవకాశాలు గణనంలో ఉంచుకొని వస్త్ర ఉత్పాదన పెంచాలని నూతన విధానం ప్రకటించింది. సరళీకరణవైపు మొగ్గు చూపినప్పటికీ చేనేతను పరిరక్షించే రిజర్వేషన్ చట్టం, చిలపల నూలు తయారీ బాధ్యత వంటి అతి ముఖ్యమైన చర్యలను కూడా అందులో పొందుపర్చారు.

రిజర్వేషన్ చట్టంలో 22 ఉత్పత్తులను చేనేత రంగానికి రిజర్వు చేశారు ( ఇటీవల ఈ సంఖ్యను 11కు తగ్గించారు). చిలపల నూలు విషయానికి వస్తే, నూలుమిల్లులు 50% నూలును కండెనూలు (చిలపల నూలు) రూపంలో ఉత్పత్తి చేయాలని, మిగిలినది మరమగ్గాల, టెక్స్టైల్ మిల్లుల్లో ఉపయోగించే కోనుల రూపంలో తీసుకురావాలని 'హ్యాంక్ యార్న్ ఆబ్లిగేషన్' ఉత్తర్వుల్లో ఆదేశించారు. కండె నూలును చేనేత మగ్గాల్లో వినియోగిస్తారనే విషయం తెలిసిందే. అయితే ఈ లక్ష్యాలకు అనుగుణంగా మిల్లులు ఎవరు కండె నూలు ఉత్పత్తి చేయలేదని, మొత్తం నూలు ఉత్పత్తిలో కండె నూలు వాటా సగటున 25 శాతం ఉందని హైదరాబాద్‌కు చెందిన చేనేత సమాచార కేంద్రం (CHIC) చెబుతోంది. అసలే కండె నూలుకు కొరత నేలకొనగా అందుబాటులోని కండెనూలు మరమగ్గాలు కాజేయడం మొదలు పెట్టడంలో పరిస్థితి మరింత విషమించింది. మరమగ్గాలపై ఉత్పత్తి చేసిన వస్త్రాన్ని చేనేత ఉత్పత్తులుగా చలామణి చేశారు. రిజర్వేషన్ చట్టాన్ని మరమగ్గాల యజమానులు దారుణంగా ఉల్లంఘించారు. చట్టాన్ని ఉల్లంఘించిన వారి పై నాన్‌బెయిలబుల్ కేసులు పెట్టే అధికారాన్ని కల్పించినా దానిని అమలు చేయలేదు.

నూతన ఆర్థిక విధానాల్లో భాగంగా 1990వ దశకం ఆరంభంలో పత్తి, పత్తినూలు ఎగుమతులు ప్రారంభించిన తర్వాత చేనేత ముడిసరుకులకు మరింత కొరత ఏర్పడింది. పత్తి ఎగుమతి కారణంగా కండెనూలు ధరలు బాగా పెరిగిపోయి చేనేత గిట్టుబాటుకాని పరిస్థితి నెలకొన్నది. దానితో చేనేత వస్త్రాలకు గిరాకీ తగ్గి గొదాములలో నిల్వలు పేరుకుపోయాయి. ఈ కారణంగా సుమారు రెండు వందల మంది చేనేత కార్మికులు ఆకలితో కొంత మంది, ఆత్మహత్యలకు పాల్పడి కొంత మంది మరణించారు.

ప్రపంచ వాణిజ్య సంస్థ ఒడంబడిక ప్రకారం పరిమాణాత్మక ఆంక్షలను ఎత్తివేయడం ప్రారంభించిన తర్వాత చేనేత కార్మికుల బ్రతుకులు దుర్భరమయ్యాయి. సత్యం కమిటీలో చేనేత రంగ ప్రతినిధులెవరు లేకపోవడం గమనార్హం. 1998 జులైలో ఏర్పాటైన ఎస్. ఆర్. సత్యం కమిటీ రిపోర్ట్సు, 2000లో ప్రకటించిన నూతన టెక్స్‌టైల్ విధానాన్ని రూపొందడానికి కారణం అయినది. పోతే పారదర్శకత కగురించి మాట్లాడే ప్రభుత్వాలు ఇంతవరకు సత్యం కమీటీ నివేదికను బయట పెట్టకపోవడం ప్రభుత్వ ఉద్ధేశాన్ని వెల్లడిస్తోంది.

చేనేత రంగం పరిరక్షణకు దోహదపడే చట్టాలను ఏరిపారేయాలని సత్యం కమిటీ సూచిస్తుందని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ శ్రీనివాసులు చెబుతున్నరు. అంతర్జాతీయ మార్కెట్‌లో ఎదురౌతున్న పోటీని తట్టుకోవడానికి ఏం చేయాలో సూచించడమే ఈ కమిటీ లక్ష్యం. అందువల్లే చేనేత మగ్గాలను మరమగ్గాలవలె మార్చుకోవాలని, కంప్యూటర్‌ల సహాయంతో తయారు చేసిన డిజైనులను వినియోగించాలని కోరడం ప్రారంభించారు. ప్రభుత్వం ప్రత్యేకంగా పథకాలను కూడా ఇందుకొసం ప్రవేశపెట్టింది. రిజర్వేషన్ చట్టాన్ని కండె నూలు నిబంధనలను కాలం చెల్లినవిగా పరిగణించి కొట్టి పారేయాలని అధికారులు వాదిస్తున్నారు.

చేనేత రంగానికి ఇస్తున్న తోడ్పాటు కారణంగా మిల్లుల అభివృద్ధి ఆగిపోయిందనే అభిప్రాయాన్ని కూడా కొంత మంది ప్రచారంలో పెట్టారు. టెక్స్‌టైల్ మిల్లులకు ప్రభుత్వాలు ఇస్తున్న భారీ మద్దతు ఎక్కడా చర్చలలోకి రాకపోగా చేనేత రంగం పూర్తిగా ప్రభుత్వ దయా దాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతుకుతోందనే అభిప్రాయం మాత్రం ప్రబలంగా వ్యాప్తిలోకి వచ్చింది. మిల్లులతో పోల్చినపుడు చేనేత రంగానికి చేస్తున్న సహాయం నామమాత్రమేనని చేనేత విజ్ఞాన విధాన కేంద్రం (CHIP) కోసం రచించిన వ్యాసంలో హైదరబాద్ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ నరేష్ శర్మ వాదించారు.

2005 తర్వాత చేనేత పరిశ్రమ అన్నదే ఉండదని, అప్పటివరకు చేనేత మగ్గాలన్ని మరమగ్గాలుగా మారిపోతాయని సత్యం కమిటీ నివేదిక చెబుతుంది. చేనేత మగ్గాలను మరమగ్గాలుగా మార్చేందుకు ఆంధ్ర ప్రదేశ్ కర్ణాటక రాష్ట్రాలలో చర్యలు తీసుకుంటున్నప్పటికీ అందుకు అవసరమైన శిక్షణను చేనేత కార్మికులకు ఇవ్వడం లేదు. ప్రత్యమ్నాయ ఉపాధిని చేనేత కార్మికులే వెతుక్కోవాలన్నది ప్రభుత్వాల ఉద్దేశ్యంగా ఉన్నట్లు కనబడుతున్నది.

2001 లో జరిగిన సమావేశంలో సత్యం కమిటీ సిఫార్సుల్లోని లోటు పాట్లను గుర్తించిన ప్రణాళిక సంఘం కొత్త కమిషన్‌ను ఏర్పాటు చేయనున్నట్లు ప్రకటించినప్పటికి ఇంత వరకు అటువంటి ప్రయత్నం జరగలేదు. తిరుపతిలో జరిగిన టెక్స్‌టైల్ మంత్రుల సమావేశం కూడా సత్యం కమిటీ సిఫార్సులను వ్యతిరేకించింది. అయితే ఆ వ్యతిరేకత కూడా మాటలకే పరిమితమైంది.

తిండికి గతిలేని చేనేత కార్మికులకు ఫ్రెంచి డిజైనర్ గురించి పాఠాలు చెప్పడమంటే, తినడానికి బ్రెడ్డు లేదని చెబితే ’ దందేముంది కేకు తినండని ’ సలహ ఇచ్చినట్లుగా ఉందని ప్రణాళికా సంఘం మాజీ సభ్యుడు ఎల్. సి. జైన్ వ్యాఖ్యానించాడు. అంతర్జాతీయ టెక్స్‌టైల్ వ్యాపారం ఎన్నో ఆంక్షలు, పరిమితులతో కూడుకున్నది కనుక చేనేత కార్మికులను ఎగుమతులపై ఆధారపడి మనుగడ సాగించే స్థితికి తీసుకురావడం ప్రమాదకరమని ఆయన హెచ్చరించారు.

అమెరికాతో సహ అభివృద్ధి చెందిన మిగిలిన దేశాలన్ని తమ తమ టెక్స్‌టైల్ కార్మికుల ప్రయోజనాలను గట్టిగా రక్షించుకుంటాయని, దాని వల్ల మన కార్మికులు వీధిన పడతారని ఆయన అంటారు.

అత్యంత క్లిష్టమైన, అందమైన డిజైన్లను ఏ కంప్యూటర్ల సహాయము లేకుండా సృష్టించిన, సృష్టిస్తున్న మన చేనేత ప్రతిభామూర్తులకు నిలువు, అడ్డం గీతలు నేయడం తప్ప మరొకటి తెలియని వ్యక్తుల సృజనాత్మకతతో పోటీ పడగలరా అని పరీక్షలు పెడుతున్నారు. ఇంత కంటే విచిత్రం మరొకటి లేదు.

2002 సంవత్సరానికి ప్రచురించిన యు.యన్.డి.పి. మానవాభివృద్ధి నివేదికలో ఇలా పేర్కొన్నారు :

"అంతర్జాతీయ మార్కెట్‌లోకి అడుగుపెడుతున్న, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని సగటు పేద వ్యక్తికి అభివృద్ధి చెందిన దేశాల్లోని కార్మికుడి కంటే రెట్టింపు అడ్డంకులు ఎదురవుతున్నాయి. అభివృద్ధి చెందిన దేశాల్లో ఒక్క వ్యవసాయం పైనే రోజుకు వందకోట్ల డాలర్ల సబ్సిడీ చెల్లిస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలకు అందిస్తున్న ఆర్థిక సహాయం కంటే ఇది ఆరు రెట్లు అధికం. సంవత్సరానికి 560కోట్ల డాలర్ల ఆర్థిక సహాయం పోందుతున్నామని సరిపెట్టుకుంటున్నాయి. ఈ దేశాలు ఎగుమతుల రూపేణా అంతకంటే చాలా ఎక్కువ స్థాయిలో నష్టపోతున్నాయి. అన్ని దేశాలకు ఇదే సూత్రం వర్తింపజేసే పరిస్థితి గనక ఉంటే వ్యవసాయ, టెక్స్‌టైల్స్, దుస్తుల తయారీ రంగాలలో ఈ దేశాలు లాభపడతాయి".

వాణిజ్యపరమైన ఆంక్షలు తగ్గించుకునేందుకు అవసరమైన విధానాలను

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

2001 దోహా సమావేశంలో ప్రపంచ వాణిజ్య సంస్థ రూపొందించినప్పటికీ కొన్ని రంగాలకు ప్రత్యేకించి టెక్స్‌టైల్స్, వ్యవసాయ సబ్సిడీల విషయంలో ఆంక్షలు తగ్గించాల్సి వచ్చినపుడు ఈ దేశాలు గట్టిగా ఆడ్డుపడతాయని ఈ నివేదికలో అభిప్రాయపడ్డారు.

మరమగ్గాలు, మిల్లుల ఆర్థిక సామర్థ్యానికి ఒక వస్తువును ఉత్పత్తి చేయడానికి అయ్యే వ్యయాన్ని కొలమానంగా తీసుకుంటారు. అదే సమయంలో చేనేత మగ్గాలకున్న సామాజిక సామర్థ్యాన్ని (ఉపాధి కల్పన), పర్యావరణ సామర్థ్యాన్ని (విద్యుత్ వినియోగం లేకుండా) కూడా పరిగణలలోకి తీసుకోవాలి.

దేశానికి ఎదురవుతున్న అతి పెద్ద సమస్య నిరుద్యోగమని 1950 వ దశకంలో పి. సి. మహలనోబిస్ చెప్పిన విషయాన్ని ఎల్. సి. జైన్ గుర్తుచేస్తున్నారు. వినియోగదారు వస్తువుల తయారీ రంగంలో యంత్రాలపై పని చేయడం ఆపివేసి చేతులకు పని కల్పించాలని ఆయన సూచించారు. గడచిన దశబ్దాల అనుభవాలకు భిన్నంగా, 2007 సంవత్సరం నాటికి చిన్న తరహా పరిశ్రమల ద్వారా 60 లక్షల కొత్త ఉద్యోగాలు, దారిద్ర నిర్మూలన పథకాల ద్వారా మరో 70 లక్షల మందికి ఉపాధి లభిస్తుందని ప్రణాళికా సంఘం తన నివేదికలో ఆశాభావం వ్యక్తం చేసింది. ఇది ఆత్మ వంచన తప్ప వేరే కాదని ఎల్. సి. జైన్ వ్యాఖ్యానించాడు.

కొత్త ఉద్యోగాలు సృష్టింపచూసుకునే ముందు చేనేత తదితర రంగాల్లోని లక్షలాది ఉద్యోగాలను మొదట కాపాడాలని జైన్ సూచిస్తున్నారు. చేనేత రంగం పై ఆధారపడి జీవస్తున్న కోటి ఇరవై లక్షల మంది ప్రజలకు ప్రత్యామ్నాయ ఉపాధి కల్పించడమనేది ప్రభుత్వం వల్ల అయ్యేది కాదు. " లక్షలాది మంది ప్రజలకు నిరుద్యోగం ఒక శాపంగా పరిణమించింది. వారి నెత్తిన విధాన నిర్ణేతలు కుమ్మరిస్తున్న నిరాశ, నిస్పృహలు, తప్పుడు ఆశలు భారత మాత చేత కంట తడి పెట్టిస్తున్నాయి" అని జైన్ ఒక సందర్భంలో పేర్కొన్నాడు.

తామున్న పరిస్థితులలో, జీవించేందుకు, సంఘర్షణ చేయడానికి అవసరమైన ధైర్యం కోట్లాది పేదలకు ఎక్కడ నుంచి వస్తుందో వింతగొలిపే విషయమని ఈ మధ్య జరిగిన ఆసియన్ సోషల్ ఫోరం సభల్లో జీన్ డ్రీజ్ చెప్పారు. అయితే తమ ధైర్యానికి, సంఘర్షణకు ఒక హద్దు ఉన్నదని ఆత్మహత్యలకు పాల్పడిన చేనేత కార్మికులు ప్రకటించుకున్నారు.



చేనేత రంగం గురించి మహాత్మగాంధీ చెప్పిన మాటలు మనకు గుర్తున్నాయా ? ఆ మాటలకు కాలం చెల్లిందా ? స్వావలంబన అనేది ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ విధానాలకు సరిపడని వస్తువా ? సరళీకరణలంటే కొన్ని రంగాలకు మేలు చేయడం కోసం మరికొన్ని రంగాలను నాశనం చేయడమా ?

---

మీ సలహాలు, ఆలోచనలు, రచనలు, మాకు పంపించండి.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support